ఒకదాని తరువాత - నొకటొకటి వెలువడును
అబ్ధియంతయు నొకటె - అందులో జలమొకటె
అంతమాత్రమె కాని - యబ్ధి వీచికలందు
ఒకదాని పోలినది - యొకటేని యుండునా
దేని కయ్యది క్రొత్త - దేదీప్యమానమౌ
కాంతి పుంజాలతో - కమనీయ రచనతో
వింతవింతల రంగు - దొంతరల తెరలతో
కనుగల్గి యీక్షించు - మనుజులకుఁ గన్పించు. క్రొత్త.

ప్రాత బంగారెల్ల బాగుగా శోధించి
దోస మేమేమున్న - తొలగించి కరిగించి
వింత నగిషీలతో - సంతనల నేర్పుతో
క్రొత్త కొలికలు దీర్చి - కోరికలు చిగురొత్త
కనఁగల్గువారికి - కనులపండువు సేయ
ఘనభూషణమ్ములు - కల్పించు సత్ శిల్పి. సరిక్రొత్త.

వానిఁ జూచినవారు - పాత బంగారంచు
వాదులాడఁగబోరు - వాని దూరగబోరు
చూచి సంతోషించి - సొగసు తెలిసినవారు
ధనమిచ్చి కొని తమ - తలలపై నిలుపరే. క్రొత్త.

మానవంతుల తలలు - మానుగా వంచిన
మానినుల మస్తక - స్థలమునం దుండవా
ఘనశిల్ప నిర్మాణ - మనువైన నగలెల్ల
విలువ గల్గినచోట - కలుగునే లోటెపుడు. సరిక్రొత్త.

*ఆ క్రయదారుఁడు :*

క్రొత్త లాంతర్లంచు - గొప్పగా చెప్పేవు
వీనిలో క్రొత్తేది - వివరింపు మోయయ్య!

ఒకసొమ్ము నమ్మదువు - ఒకసొమ్ము వర్ణింతు
వడుగు ప్రశ్నలకేమి - నుడువగా లేకుండ
ప్రస్తుతమ్మిసుమంత - పాటింపకుండంగ
అప్రస్తుతమ్మైన - యాలాపములఁబల్కి
వర్ణనల సొగసుతో - వంచింపఁబోతావు
కవివంచు నినునేను - గట్టిగా తిట్టేను. క్రొత్త.

*అమ్మకపువాఁడు :*

క్రొత్తలాంతర్లివిగో - కొనరండి
సరిక్రొత్త లాంతర్లు - సంగ్రహించండి

తెలిసినట్లు పచించి - తెలియకుండగనుండు
నీతోడ నాకేల - నీ తోవ నేరాను
పోవోయి వాదేల - పోవోయి నీ దారి. క్రొత్త.

నాపైని నీ మదిని - ఏపైన కోపమ్ము
కలదేమొ తెలుపుమా - కారణమ్మను దెల్పు
నీకు లాంతర్లున్న - నీవమ్మకొనవచ్చు
నీ సొమ్ము కనిమెచ్చ - నీసు మాలో లేదు
నీదారి నీదయ్య - మాదారి మాదౌను. క్రొత్త.

గుడ్డికంటికి నైజ - గుణమునకు మందేది
పరులబాగును జూచి - భరియింపఁగాలేవు
ఏమిలాభము నీకు - నిటులాడి నిలువంగ
పోయి నీ పనిచూడు - పోవోయి నీదారి. క్రొత్త.

వ్యంగ్యమార్గము నీకు - పరిచితము కాదేమి
ప్రామాణికుల పథము - పడదు పడదో నీకు
కళలోని సొగసులు - కలలోను కాంచవా

కాంచియుంచేని యీ - కలుషంపు వాదేల
పోయి నీ పనిచూడు - పోవోయి నీ దారి. క్రొత్త.

ఆ వీధి యీ వీధి యేవీథిలోనైన
మా సొమ్ము కొనగలరు - ఈసు నీకేలయ్య
అన్ని వీథులు మావి - అస్తు మాకేముంది
విను వీథిలో నెల్ల - కని మెచ్చి కొనగలరు. క్రొత్త.

పండితుల బల్లపై - పామరుల యిళ్లలో
విద్యార్థి చేతిలో - విద్వాంసులకు ముందు
పెంపుగా మా సొమ్ము - వెలుగిచ్చి వెలుగొందు
పోవయ్య పనిలేని - పోరేల పోవయ్య.

ఆనాడు ఈనాడు - ఏనాటి కేనియును
ఆ వాడ యీ వాడ - యే వాడలో నైన
విలువ తెలిసినవారు - పెక్కురున్నారయ్య
మా సొమ్ము చెల్లదా - మాకేల యీ వాదు. క్రొత్త.

*మఱియొక వాడలోని యొకడు :*

ఒక లాంత రీవయ్య - ఓ మంచివాఁడా !
చదువుకొందామన్న - సరియైన దీపమ్ము
అగపడదు మా బాబు - అడిగిన వెలయిత్తు
ఒక లాంత రీవయ్య - ఓ మంచివాఁడా !

*అమ్మకపువాడు :*

నెత్తిపైనీ గంప - ఉత్తదైపోయింది
అన్ని లాంతరు లిపుడె - అమ్ముడై పోయాయి
మళ్లి తెస్తానండి - మరునాడు నిలువండి

మీ పేరు తెలిపితే - నేపారు ప్రేమతో
మళ్ళి తెచ్చిస్తాను - మన్నించుఁడీ బాబు. క్రొత్త.

మ. కవితారూపము నిత్యనూతనము, వాగ్వైచిత్రి నానావిధ
స్తవనీయమ్మగు మార్గమున్ గలది, శబ్దాంభోధిలో నున్న ర
త్న వితానమ్ముల కంతులేదు, మఱి యర్థవ్యాప్తి సత్కల్పనా
భవమై రంజిలు నిట్టికావ్యములు నవ్యంబుల్‌గదా యెప్పుడున్.



## చెలికాడా !

వినుమియ్యది సత్యము, మన
సిచ్చిన కిన్నుకు నిదురేమిటిరా :

ప్రభువిచ్చినవివి కూరాకుమెతుకు
లేమిటి రుచియని తగువాదకురా !

ఉన్నది సీకడ సీదగు నొరులకు
సీదగు నేదియు చేజారదురా !

రెప్పల బదనుగ నిదురుంచిన కన్నుకు, వే
రొప్పదు తలగడ బరువవ్వునురా !

సంతకబీరుని సిద్ధాంతము సత్యము
శిరమిచ్చిన తదుపరి నేడుపు వృథరా !

—కబీరు

కవిత :

# ఏమిచెప్పనేర్చినాను ?

— శ్రీ కనపర్తి

నాకు భావనాసంపద
కే కొదువయు లేదుగాని
'యేది చూపు'మని యడిగిన
యేమిచూపగల్గినాను ?

నా నవనాడులలోపల
నలిగిన భావనలు కోట్లు
కోట్లలోన నలుగని వే
కొలదిని చూపించగలను ?

నాగుండియలోయ లోన
దాగిన తలపులు లక్షలు
లక్షలలో ఎన్నింటిని
రక్షించగజాలినాను ?

నాగొంతుక తలుపు వెనుక
ఆగిన భావములు వేలు
తలుపు తెరచి యెన్నింటికి
దారి చూపగల్గినాను ?

నా జిహ్వాగ్రమునుదాటి
నడచిన తలపులు వందలు
గమియించెడు యెన్నింటికి
గమ్య మెరుకపరచినాను ?

నాగంటమునుండి జారి
నట్టి భావకదంబమున
ఏ కొన్నింటికి సఫలత
చేకూర్చగజాలినాను ?

వింతఘటనలెవో మనో
వీథులలో సంచరింప
ఏమేమో చెప్పదలచి
ఏమిచెప్ప నేర్చినాను ?

నాకు భావనాసంపద
కే కొదువయు లేదుగాని
'యేది చూపు'మని యడిగిన
యేమి చూపగల్గినాను ?



*కథానిక :*

# రంగడు

— *శ్రీ గూడూరి సీతారాం*

తెల్లారుతాంది; పొద్దుగూకుతాంది. మనుసులు రాత్రి పడుకుంటుంర్రు; తెల్లారినాంక లేత్తుంర్రు. దినాలు ఎడ్ల కచ్చరం గీరలోలె తిరుగుతున్నయి. సూత్తుండె, సూత్తుండెంగనే ఏందో ఏందో మారిపోతాంది. ఎట్లెట్లనో అయితున్నయి దినాలు.

రంగడు గా చిన్నతనాన్నెప్పుడో పల్లె నిడిసివెట్టి బతుకుతెరువు సూసుకోను విలాయిపోయిండు. అక్కడ్నే రంగడు పెరింగిండు, పెద్దోడైండు. పెండ్లాన్ని జేసుకుండు, ఆఖరికత్తే యిద్దరు పిల్లగాండ్లు కూడా పుట్టింర్రు. రంగడు ఆడు పుట్టిన ఊరునే మరిసిపోయిండు. ఎప్పుడో అపపదపప సిన్నాయిన్నో, పెదనాయిన్న కొడుకు రాజమో యిక్కడి కుశలం, అక్కడి సంగతులు రాయిస్తూ ఉండగలరని రాసే ఉత్తరాల్ను మాత్రమే సూసేటోడు. గంతేగాని ఆని ఊరిసంగతి ముత్తెమంతన్నా యాదికిలేదు. ఏందో ఏమోగాని ఓనాడు రంగనికి జెప్పన ఆని ఊరికి పోవాల్నని బుద్ధిపుట్టింది. అంది అట్టి మంకుపట్టు. ఏదనుకుంటే అది ఆ గడియల అయ్యిపోవాలె. అంతే. రంగడు పోతానని అనుకున్నడు ఆలసం కాలేదు. తయారుగానే అయిండు.

ఏంది పాతకాలమోలెనా? యియ్యాలనుకున్నడు. రేపు పొద్దుగూకే యాల్లకు ఊరికి జేరనే జేరిండు. రంగడు బస్సు దిగులె దిగుతెనే ఆనూరు అక్కడి కెంత దూరమని అడిగిండు. పొద్దుగూకింది. తెల్లారినాంక ముసిముసి మబ్బుల బయతెల్లితె గొల్లంబటోల్లకు మీ ఊరికి పోతవని జెప్పిండు. గాని ఆనికి మనుసొప్పలేదు సిలుసుండడానికి. గాని మరేంజేత్తడు?...రాత్రంతా నిద్రవట్టలేదు. ఎప్పుడో సిన్నప్పుడు సూసిండు. ఎంత మారిందో, ఏందో అనుకున్నడు. ఊళ్ళె నన్నెవలు యాదికివట్టరు. ఫలానా రాజయ్య కొడుకంటే ఊళ్ళోల్లందరు ముక్కుమీన సెయ్యివెట్టుకొని యిస్త్రిగ వడుతరు. ఎంతోడు ఎంతైండని, బతుకుతెరువు సూసుకున్నడని ఎంచ రెందరు ఎట్లెట్ల గుసగుసలు వెట్టుకుంటరో ఏందో సానా సిత్రంగా ఉంటుందని ఇంకేందేందో మనుసుల అనుకుంట గట్టిగా కన్ను మూసిండు. పక్కోన్ని గడియారమెంత గొట్టిందని అడిగి.

పట్టన తెల్లారింది. పొద్దు పొడిసింది. గప్పుడే కొట్రామోతె ఎండొచ్చింది. రంగడు గట్టిగా పెయ్యివిరిసి లేసిండు. లేత్తలేత్తనే నెత్తికింద వెట్టుకున్న సంచినివట్టుకుని దబదబ నడిసిండు. కొత్త తొవ్వాయె. కోసుకోపాటి తొవ్వ సంగతి తెలుసుకున్నా సానమాట్ల తొవ్వదప్పిండు. నెత్తిమీదికి పొద్దొచ్చే యాళ్ళకు ఆనూరికి జేరిండు. రంగడు మొదట్ల సానా పరిషానైండు. ఏందో కొత్తూళ్లె అడుగువెట్టినట్లైంది. ఎంత యాదికి జేసుకున్న సిన్నప్పటి ఊరని సత్తె యాదికిరాలే.

ఏట్లైతేంది? రంగడు ఊళ్ళె జేరిండు. ఊళ్ళె కత్తనే సిన్నాయిన్నింటికి పోయిండు. ఆ డెవళ్ళూ రంగన్ని గుర్తువట్టలే. పెద్దగంట సేపైనాంక, రంగడు బిలాయి పోయినకాడ్నుంచి పూసగుచ్చినట్టు చెప్పినాంక నమ్మింండ్రు, గప్పుడు యింట్లున్న ఆడోళ్ళంతా సోకంబెట్టి ఏడిసింండ్రు.

రంగడచ్చి సూత్తుండంగనే రెండ్రోజులు అయిపోయినయి. యింట్లకెల్లి కాలు బయటవెట్టనీయలె. ఆడు ఎట్లెట్ల తిరిగిండు, ఎట్లెట్ల సంపాయించిండు, ఎట్లెట్ల లగ్గంజేసుకున్నడు గా సంగతులన్ని జెప్పుతుంటే బాగోతమిన్నట్టు యింట్లోళ్ళు, యింటి సుట్టుపక్కలోళ్ళు సెవు లిక్కరించుకొని యున్నరు. ఆళ్ళందరు రంగన్ని మంచోడవు, తెలివిగలోడవంటుంటే ఆనికి పుల్లగుర్రమెక్కినంత సంబరపడ్డడు.

గా మూడోనాడు రంగనికి ఇంట్లకెల్లి అవుతలికి పోవడానికి సందు దొరికింది. ఆని సిన్నతనాన సూసిన దొరసాన్ని ఒక్కసారి, సూడబుద్ధి అయ్యింది. సోపతికి సిన్నాయన్న కొడుకు లచ్చన్నెంటవెట్టుకొని బయిలెల్లిండు. సానా సేపు తిరిగిండు. గాని ఎక్కడా యెంకట్రామయ్యదొరగారిల్లు కనిపియ్యలె. ఇగ ఉండవట్టలేక లచ్చిగాన్నిఅడిగిండు. 'గా కనిపిత్తలేదేబంగ్లా. గదే దొరగారోల్లది' అని లచ్చిగాడన్నడు. రంగడట్లనే బీరిపోయిండు. ఎంత యాదిమరిసిపోయినా, ఆనికేందో ఒక్కపాలే గబక్కున యాదికచ్చినట్లైంది.

రంగడు సానాసిన్నోడు. మూఅంటే ఆరేడేండ్లుంటయి. గంతసిన్నప్పుడే ఆడు గోదలనుకాసేది. ఆడు పొద్దుపొడ్వక ముందే బర్లనుకొట్టుకొని ఊదుల్లుదాటి పొయ్యేది. ఎప్పుడో పొద్దు నెత్తిమీదికచ్చినాంక పొద్దుగాలదెచ్చుకున్న సద్ది గడుక తోటోల్లందరితోకలసితినేది. గదీ రంగడుచేసేపని. ఆయింత ఓనాడేమైందంటే ఆడుకాసే బర్లల్లకెల్లి నాలుగైదు తప్పిపోయి దొరగార్లసేన్లవడ్డయి.

యిగజూసుకో దొరగారి పాలేరోడచ్చి రంగన్ని కసాయోనోలె సావగొట్టిండు. కొట్టినోడుకొట్టి యిడిసన్న వెట్టలే. ఈతనారతో యిరిసికట్టేసి దొరగారింటికి తన్నుకుంటా తీసుకవోయిండు. బర్లనుకట్టేసేకొట్టంల రంగన్ని గుంజకు యిరిసి కట్టిండు. రాత్రిఅయితాంది. రంగనికి బుగులుబుగులుగావట్టింది. ఒక్కడేనాయె. సిమ్మంటీకటాయె. గందులోనే దోమలు గరుసుడాయె. బాగా ఏడుత్తా మనుకుండు. గాని పెద్దదొరలేత్తె సావచంపుతడని గట్టిగా నోరు మూసుకుండు. సాకల్దచ్చిపోయింది. యిగనన్న యిడిసివెడుత రనుకున్నడు. రంగడు పడ్వలేక బుగులుతో మూలుగుడు వెట్టిండు. గా మూలుగుడు ఎంత సేపు మూలిగిండోగాని పెద్ద దొరసాని నిలుసోని పాలేరుతోని కట్లిప్పెయ్యంగ రంగడు కండ్లు దెరిసిండు. రంగనికి గజగజ వణకుడు పుచ్చుకుంది. ఏం దోస లేదు ఆనికి. ఒక్కసారి దొరసాని కాళ్ళమీనవడి బావురుమని ఏడ్చిండు. ఇంక సచ్చేదాక గసొంటి తప్పుపని చెయ్యనని బలంకొద్ది పది పదకొండుమాట్ల సెంప లేసుకున్నడు. దొరసాని ఎంతమంచిది? ఆ అద్మనాత్రి రంగనికి అన్నం వెట్టించింది. ఓ పాత అంగి-పంచె యిచ్చి పాలేరొన్ని రంగన్ని ఆనింటిదాక పడగొట్టి రారా అని తోలింది.

గిసొంటి సంగతులు రంగనికి కండ్లముందు ఎన్నో కనిపించినయి. ఆదొడ్డ తల్లి నింప నూరేండ్లు బతుకాలని సేతులెత్తి దేవునికి మొక్కిండు. ఇక ఉండవట్ట లేక 'దొరసాన్నొక్కసారి సూత్తే మంచిగుండు' అనుకున్నడు. అనుకునుడు ఆలసంలేదు దొరగారి బంగ్లామొకాన నడిసిండు. 'లచ్చిగా పెద్దదొరసాన్ని నువ్వెప్పుడన్నా సూచినావురా' అని తొవ్వల అడిగిండు. "నా సిన్నప్పుడు ఎప్పుడో సచ్చిపోయిందట. దొరసాని సానా మంచిదట. మనోళ్ళ..." లచ్చిగాని మాటలు కొనెళ్ళయినకనే "ఏందిరా..." అనుకుంటా రంగ డాగిపోయిండు. కండ్లకెల్లి ఊటూరినట్టు నీళ్ళుకారినయ్.

రంగడు పిచ్చోనోలె అయిండు. ఒక్కసారి దొరసాన్ని జూసి "మీ సలువ దొరసానీ, మీ దయుంటే పిల్లాజెల్లా నాలుగు కాలాలపాటు బతుకుతామని" సెప్పి కాళ్ళు మొక్కి వత్తామనుకున్నడు. యిగేం మనసున వట్టలే. సక్కంగ యింటికచ్చిండు. నాత్రి కూడన్న ముట్టలే.

రంగనితాత కల్లుతాగేకాడ ఆల్లసంగతి, యీల్లసంగతి సానా ముచ్చట్లు జెప్పిండు. తాత దేంది కల్లుతాగుతే అయిపాయె. ఏదేదో సెప్పుతడు. గప్పుడే దొరగారొల్ల సంగతిగూడా జెప్పిండు.

"దొరకన్న దొరసాని ఎన్నోపాళ్ళు నయం. దొరకేం తెలుస్తది? ఓసారి దొరసాని సుట్టోరికం పోతే దొరసంగతి బయటపడ్డది. ఏదో సూపుకుంటడు. అంత దొరసాని సేతుల మీనికెల్లే నడుస్తది. ఊళ్ళోల్లకు రూపాయలు బాకీలు యిత్తుండేది. వడ్లంటే, మక్కలంటే, పెసళ్ళంటే యాల్లకు అదొక్క దినుసు లిచ్చి దేవునోలె ఆదుకునేది. అసొంటితల్లి యిగపుడుతదా? అయితేంది మంచోళ్లకే సావు చెప్పనత్తది. నా అసొంటోడు సూడు తినపోతె తిండికిలేకున్నా నిండ నూరేళ్ళు బతుకుతడు. గాని ఆ బంగారుతల్లికి ఏందో తిరగని రోగమచ్చింది. ఆయంతోనాడు పిడాశ పాణంబోయింది. సచ్చేదాక ఎవళకన్నా తెలిసిందా? ఆదినం జూడాలె. ఊరు ఊరంతా కదిలింది. అంతా సోకంబెట్టి పడిసింద్రు. ఆ దొరసానిపోయింది. ఆ యింటలచ్చిమే పోయింది. శనేస్రం కూడుకుంది. అన్నిరోజులు అట్టిట్టుగున్నదొర దొరతనం మొదలుపెట్టిండు. యింకేంది? ఊళ్ళోలంతా యాడాది తిరుగకమునుపే దొరంటే ముక్కిరుసుడు మొదలుపెట్టింద్రు. గన్ని దినాలులేంది దొరకు ఏం బుద్ధి పుట్టిందో, ఏందో ఓదాన్ని వుంచుకున్నడు. ఇట్లున్నదంతా ఆ ముండ చేతులపెట్టె. యిగ నువ్వే జెప్పురా ఆళ్ల సంసారం ఎట్లుంటదో? రెండు మూడేండ్లు కాంగనే దొరకు తినపోతే తిండికి లేకుంట అయింది. దొరసాని కట్టించిన బంగ్ల అప్పులోల్లు గిర్వు పెట్టుకున్నరు. భూములన్నీ పందిపాలైనయి. ఉన్న ఒక్క కొడుకేమో దేశాలపాలైండు...",

రంగడు తాత సెప్పుతుంటేకట్టెగొయ్యోలె కూసొనిపోయిండు. సిన్నప్పటి నుంచి దొరసానంటె రంగనికి పాణం. రోజుకొక్కసారన్నా, దొరసాన్ని యాది జేసుకోకుంట బతుకలేడు. రంగనికి పుట్టిపూరంటే దొరసానే యాదికత్తది. అనూరే ఆనికి దొరసాని. ఆళ్లసంసారం గట్ల అయిందనంగనే రంగని పాణం కలికలి అయింది. గంత దూరంకెల్లి యాడిదాక ఉత్తపుణ్ణానికి వత్తినే అనుకున్నడు. ఇక్కడికి రాకపోయినా దొరసాని గిట్లుంటది, గట్లుంటది అని యాదిజేసుకుంటా బతుకుతు. ఛీ... ఛీ... ఎధవను. ఎందుకు యింత దూరమత్తినా అని యిసారంల పడ్డడు రంగడు.

ఇక ఆడ ఉండబుద్ధిగాలె. పదిగేనురోజులు రజా దెచ్చుకున్న రంగడు తెల్లారే బిలాయికి పయనంగట్టిండు.



# సాంత్వనము

— శ్రీ జె. బాపురెడ్డి

కన్నీరు తుడుచుకో కృష్ణవేణీ ! నీ
కష్టాలు ఈడేరెనమ్మా !
ఇన్నాళ్ళు కన్న నీ కలలన్ని నిజములై
ఎదలోని ఆశాలతలు పూలడోలలై
ఆనందములు పండునమ్మా !
కన్నీరు తుడుచుకోవమ్మా !

అడవిపాలైన నీ అందాల బ్రతుకునకు
కడలిపాలైన నీ సంసార సంపదకు
మంచినాళ్ళేతెంచె మరచిపో గతగాథ ॥కన్నీ॥

నీవు దేశచరిత్ర గర్భాన పుట్టితివి
ఒక మహాప్రస్థాన మెదియొ తలపెట్టితివి
ఏ నెరుంగుదు జీవనమ్మెందరికొ ఇచ్చి
ఎటుతోచకీవె సంద్రము త్రోవపట్టితివి ॥కన్నీ॥

నీమహాగాన నిక్వాణమ్ములో కరిగి
నీసుధామయ పుణ్యతీరమ్ములో పెరిగి
పోయె నెన్నో శతాబ్దాలు సామ్రాజ్యాలు
కాని నీకొక ఆలయమును కట్టనెలేదు
నే నెరుంగుదు నీకు నిల్వ నీడేలేదు ॥కన్నీ॥

నీదరినె గుండె తడిలేని భూముల జూచి
నీముందె ప్రజలు పస్తు పరుండుటను జూచి
నిలయమ్ములేక వారికి సాయపడలేక
నీ సుచైతన్య ధారాశక్తి యంతయును

'అడవిగాచిన వెన్నెలాయెనా' యని ఎంత
గా పరితపించినావో నదీజననీ ! ॥కన్నీ॥

నవయుగారంభోత్సవమ్ములో ఈనాడు
నవభారత ప్రభాత ప్రభాస్నాతులై
నీ బృహచ్ఛక్తి నిర్భర హృదయము గ్రహించి
తమ జీర్ణజీవితాలకు సౌఖ్యమాశించి
నీ ప్రజాకోటి, దృఢముగ నడుములు బిగించి
నిర్మించుచున్నారు నీకు సౌధాలయము
కన్నీరు తుడుచుకో కృష్ణవేణీ ! నీ
కష్టాలు ఈదేరెనమ్మా !

అపరబుద్ధావతారుడగు నాగార్జునుని
నర్మప్రబోధ ప్రతిధ్వనిత గిరిసీమ,
విస్మృతేక్ష్వాకు సామ్రాజ్య నిర్మిత బౌద్ధ
విశ్వవిద్యాలయ కళాపునీతస్థలుల
నిర్మించుచున్నారు నీకు 'నాగార్జున
సాగర' మహాలయము సౌందర్యనిలయమ్ము ॥కన్నీ॥

నీ కనులముందె కలకలలాడి ఆనాడు
కాలపర్జన్య సంపాత నిర్ఘాతముల
నశియించిన విజయపురము పునర్నిర్మించి
నీ ప్రాంగణాన నిత్యమ్ము శోభించులే ॥కన్నీ॥

అలనాటి బౌద్ధకళారామ వికసితా
మ్లాన శిల్పకళాసుమాల మాలలుకట్టి
నీగృహ మలంకరింతురులే జనులు తల్లి ॥కన్నీ॥

నీసేవచేయ పడవలు తిరుగు నీయింట
నీలో ప్రమోదోర్మికలు పొంగి పొరలాడ

నీభవన కుడ్యాలపై విశాల ప్రకృతి
సుందర సువర్ణ చిత్రాలు చిత్రించులే,
నీ నిలయ సౌందర్యగరిమ తిలకించగా
నీక్రొత్త బ్రతుకు లోతులు దూరిపాడగా
రసికులు, కళాప్రియులు, అభ్యుదయకాముకులు
దేశదేశాలనుండియు చేరవత్తురే ॥కన్నీ॥

నీచూపు ప్రసరించు నంతదూరము నేల
పల్లవించు, శ్రుతించు నవ్యజీవన హేల
అగును నీ కరుణామృతము పారు ప్రాంతాలు
నిత్య సౌభాగ్య సంతోషాల నిలయాలు,
నీలాస్య జలపాత జనిత జీవధ్వనులు
నీహాస విద్యుజ్జనిత కాంతి రేఖికలు
పట్టణాలను, పల్లె పల్లెలో ప్రతియింట
కలిగించు మోదమ్ము వెలిగించు భాగ్యాలు ॥కన్నీ॥

ఆంధ్రదేశమున కాశా శాంతినిలయమై
నవభారతాభ్యుదయమునకు సంకేతమై
బాధా దరిద్రాలపై విజయచిహ్నమై
నీభూరి సాగర సదనము వర్ధిల్లులే.

నీ మహాగంభీర హృదయసాగరములో
నీ తేనె కలలు అలలై ఆడులే ఎపుడు
నీ భావిదేశ ప్రజాభావి ఒకరీతి
స్వర్గశోభా సమన్వితములై వెలుగులే
నా శుభాకాంక్షలివిగో అందుకొనగలే,
కన్నీరు తుడుచుకో కృష్ణవేణీ! నీ
కష్టాలు ఈదేరునమ్మా!

★

విమర్శన :

# సంజదీపం

— శ్రీ బొడ్డపాటి కుటుంబరాయశర్మ

తొలిసారి సవిమర్శనగా నేను చదివిన గల్పికల సంపుటి సంజదీపం. శ్రీ పూ. శా. గారీ సంపుటికి కర్తలు. గల్పికా కర్తలలో ప్రసిద్ధులుగా, తత్ప్రవచనలో కృతబుద్ధులుగా, వీరు లబ్ధప్రతిష్ఠులు. వీరి గల్పికలలో నే నభినందించఁగల్గిన యొక్కొక్కదానిని గూర్చి సంగ్రహంగా రెండుమూడు వాక్యాలు వ్రాస్తాను.

**1. సంజదీపం :**

వ్యక్తుల మనోవికారాలనీ, వ్యవస్థల వెఱ్ఱితలలనీ విశ్లేషించి పరిహసించడం అనే లక్షణానికి ఇది పరమలక్ష్యమైంది. (a) వేరుశనగపప్పు తినడం— మంచినీళ్లు తాగడం; (b) రాట్నం పొయ్యిలో పెట్టలేదుగదా! (c) నాలుగుదారాలు రోజూ తీస్తే యే ధోవతో లేక చీరో (క్రమభంగం సొగసు కనిపెట్టండి) అవదూ? (d) మొత్తంమీద వీళ్లు (రేషనింగువాళ్లు) బతకనిచ్చేటట్లు లేదు; (e) గాంధీగారి ఆఖరు తత్వం నిరశనవ్రతం ఉండనేఉంది; (f) ఎన్ని ఉన్నా లేవనడం ఆడవాళ్ళ లక్షణం— మొదలైనవి పరిహాసకుశలత కుజ్జ్వలోదాహరణాలు. 'అన్నీ సమస్యలే' :— 'ఎప్పుడో పస్తుపడకుంటామో లేదోగాని, యిప్పుడు (దీపం మంగళం పాడేస్తే) పడుకోవాలి' అనేది ప్రారంభానుకూలమైన ముగింపు "గల్పికకు". మధ్యలో జగద్వ్యాలమైన సంచారం చేసిచేసి వస్తుంది గల్పిక, అని చెప్పటానికి కూడా యిది ఉదాహరణమౌతోంది.

**2. మానసపుత్రుడు :**

గల్పిక సన్నివేశప్రధానమంటానికీ, కొసమెరుపుతో ముగిస్తుంది అంటానికీ, దీన్ని లక్ష్యంగా చెప్పాలి. అత్తవారింటికని ఉత్సాహంతో ఏ స్టేషనుకు వెళ్ళాడో, ఆ స్టేషనే యావజ్జీవితమూ తలపునకు వచ్చినపుడెల్లా విషాదంగొల్పటం చూడండి చిత్రం!

**3. తీయని వెన్నెలరేయి :**

ఇందులో గూడా అకస్మిక సంఘటనచేత కొసమెరుపే ప్రధానంగాని, 'గాడిదా! కునుకుతున్నావురా?' అనిన విరంజనాపికి, 'లేదు బాబయ్యా!' అంటూ వెంకన్న సమాధానమిస్తూ, విరంజినాన్ని గాడిదకు తండ్రిగా చేసివేయడం మరచిపోలేం. ఆధునిక వివాహాలకు ముఖ్యకారణాలైన పత్రికలని వీరు బాగా దూయబట్టగలరు.

**4. పెళ్లిచేసిచూడు :**

మన ఆసక్తి చూరగొనే ఆరంభమున్నూ క్రమక్రమంగా విషయాల లోతు చూపించడమూ ఇందులో అద్భుతంగా చిత్రింపబడ్డై. గోపాలంపంతులూ— ఆయన కూతురూ— వీరి

స్వభావాలు వర్ణింపబడడంగాదు; ప్రదర్శింపబడడం యిందులో ప్రధానం. పెళ్లిచేస్తే యిల్లుగుల్ల; చేయకపోతే సంఘం ఒల్లదు; ఇదొక నిరుత్తర నిరంతర ప్రశ్న. 'పురుషుల్లో వున్న అహంకారశక్తుల్ని దుళ్లకొట్టేవరకు పెళ్ళిచేసుకోను' అన్న అమ్మాయిగారు రూపసియైన అవబోయే భర్తను చూసేసరికి....తన ఉపన్యాసమంతా మరచిపోయింది. ఇదే యిందులో కొసమెరుపు. పెళ్ళయ్యేవరకూ కబుర్లేగాని, కాపురం చేస్తూంటే తల్లిదండ్రులు జ్ఞాపకమొస్తారా ? అది అంతా మంగళసూత్ర మహత్వం. ఇంతకూ పెళ్ళిళ్లు చేయడమా ? చేయకపోవడమా ? మన సంఘంలో ఏది కాయ ? ఏది పండు ? ప్రారంభిస్తూనే గోపాలం భార్య 'కాయా ! పండా !' అని వేసిన యీ ప్రశ్న యిప్పటికీ మనకు సమస్యగా మిగలనేమిగిలింది.

5. క్రీనీడలు :

భార్య యెంత గయ్యాళిగండ్రైనా కొడుకెంత దుర్మార్గుడైనా వాళ్లు బ్రతికి ఉన్నప్పుడుండే ఆనందంలో వెయ్యోవంతుకూడా ఇప్పుడు లేదనుకునే సీతారామయ్య నిజంగా ఎప్పుడూ శాంతి కున్యుడే ! తన క్రీనీడనిచూసే యింకా యింట్లో మనుషులున్నారని కాలం గడుపుకువచ్చే అతనిని నిజంగా యే ఆశారేఖ కదిలిస్తుందో ! వదిలితే చాలుననుకొన్న పీడ వదిలిన తర్వాత గతించిందే మంచికాలం అని మళ్ళీ అంగలార్చడమే కొసమెరుగు కథలో — జీవిత సత్యమూ యిదేగదా !

6. జీవితం :

భార్యని పంపించమని యెన్నిసార్లు మామగారు ఉత్తరాలు వ్రాసినా జవాబే యివ్వని సూర్యారావు "మీ కూతురు మిమ్మల్నందర్నీ చూడాలని యెంతో ఆత్రుత పడుతోంది" అని వ్రాసి ఆమెను పంపివేయడం చూడగా, పరిస్థితుల ప్రభావమే. సంఘటనల ప్రాముఖ్యం యిందులోను అగుపడుతుంది.

7. సలహా :

ఏ "తటిల్లత" మిస్ అవటం నిజంగా దేశం చేసుకున్న అదృష్టమో ఆ తటిల్లతయే. హైయిరాయిల్ కంపెనీవాళ్ళవల్లా, స్నోవాలాలవల్లా, పూతనగా మారిపోయి చర్మరోగ వైద్య నిపుణుల చికిత్సకోసమై స్విడ్జర్లాండ్ పలాయనమైంది. తటిల్లత తన చెల్లెలికి వ్రాసిన జాబుతో ముగిసింది యీ గల్పిక. "తటిల్లతా విషాద" అనే తుదిపలుకులోవుంది. యిందులో వైచిత్రి అంతా "తటిల్లత వ్రాలు" అని వ్రాసుకొనే యోగ్యతన్నాలేని దానికే లోకం అంత బ్రహ్మరథం పట్టింది అవడం, హేళనగా నిజం చెప్పటం.

8. సానుభూతి :

పసిపిల్లయైన లలితలో భయమూ, చనువూ, సానుభూతీ, నిరీక్ష, వైరాశ్యం, మౌగ్ధ్యం, యివన్నీ పరిస్థితి ప్రభావాలే ! సన్నివేశ ప్రాధాన్యానికి యీ గల్పిక పట్టుకొమ్మ. అంత చిన్న వయస్సులో లలిత కా సానుభూతి, పూర్వజన్మ సంస్కారరూపప్రేరణయే. దీనివే పాత్రలు

ఇంచుక సహజత్వాన్ని అతిశయించడమంటాము. వ్యవహారజగత్తుకన్నా భిన్నమైన కావ్యజగత్తు, కొంచెం సహజత్వాన్ని అతిశయించినపుడే సృష్టింపబడుతోంది.

## 9. నవ్వే పువ్వులు :

ఇక ఏమైనాసరే ఆ వృత్తివల్ల జీవనం గడపకూడదని నిశ్చయించుకున్న కనకాంగిని, తూలుకుంటూ, తూలుకుంటూ వచ్చిన అన్న, ఉన్న వందరూపాయలూ జల కిడుగుకొని పోవడం చూడండి ! దీన్ని సన్నివేశ సంఘటనగాక, మరేమంటాం ? అలా నిశ్చయించుకొన్న కనకాంగికి, మరునాటి భోజనానికై ఇలా ముస్తాబై గుమ్మంవద్దగ్గర నుంచోక తప్పదాయె ! ఇంతకు మించిన పరివర్తనం మరేముంటుంది ?

## 10. పిల్ల నచ్చింది :

ఎవర్నీ చేసుకోనన్న కుటుంబరావు పెళ్ళికి మొగ్గడం, స్ఫోటకపు చింతమొద్దయిన మేనమామ కూతుర్ని తప్పించుకున్న అతనికి, ఇతరత్రా పెళ్ళియాడిన పిమ్మట కూడా ప్రారబ్ధంకొద్దీ భార్య స్ఫోటకపు చింతమొద్దే అవడం, దీనికితోడు ఎవ్వరూ అనుకోనట్టుగా ఆ మేనమామే అతనికి సాయపడటం—ఇవన్నీ హఠాత్సంఘటనలే ! గల్పిక ఒక అనుభవం, లేదా— ఒక అనుభవంలోని దశాభేదం, దశాపరిణామం—అంటానికి ఈ గల్పిక సజీవోదాహరణం. తన భార్య స్ఫోటకానికి పూర్వమూ, తర్వాతా కూడా కుటుంబరావు ఆమె గానానికి, నాగస్వరం వింటున్న పాములాగే తన్మయుడయ్యాడు. కాని ఆ అనుభవాల్లో మళ్ళా వ్యత్యాసం వుంది. అప్పుడానందంలో విన్నాడు; ఇప్పుడు విషాదంలో. అప్పుడామె అందానికి గర్వపడుతూ విన్నాడు; ఇప్పుడు కించతో వింటున్నాడు. ఇదే గల్పికకు ఆయువుపట్టు. అనేకమైన ఆరోహణావరోహణ క్రమాలకు గురియైన మనః పరివర్తనముకూడా యిందులో గమనార్హమే !

## 11. వాడిన రోజా :

కుటుంబరావునకు వ్యాధి పోయింది. దానితోపాటుగా ఎన్నడూ చలించని రోజమ్మకు ధైర్యమూ పోయింది. ఇది ఒక పరివర్తనం. అతడేమనుకుంటాడో అని భయపడి రోజా తన మనస్సు వెల్లడించక లోలో విచారించుకోటం రెండో పరివర్తనం. అతని జాబుకోసమే యెదురు చూస్తూకూడా, తీరా ఆజాబువస్తే, వెళ్ళడానికి జంకు. ఇది యింకోదశ. తనకు తానే పెద్దయైన కుటుంబరావు మటుకు కుటుంబరావు. పెళ్ళి వద్దనుకొని, హోటలుతిండి పడక రోజాను రమ్మని వ్రాస్తే యే అపార్థం వస్తుందో అని భయంచే మానుకొనికూడా, యేదో యేమరుపాటున ఉత్తరంవ్రాసి పారేస్తాడే అది, ఆ పరిస్థితుల్లోఉండే మనస్సుయొక్క సహజమైన అస్థిమితత్వ వర్ణనం. తాను సెలవుపెట్టి వెళ్ళితే నల్గురూ ఏమనుకుంటారో అనే సంశయం అలా ఉంటూండగానే రోజా ప్రయాణం సాగించడం, బలవంతపెడితే ఉందాం అనుకుంటూనే తిరిగిరావడం, అతడు రమ్మనంది యెందుకు వెళ్ళాలి అనుకుంటూ అతని ఉత్తరం రాకముందే అతని చివరి చూపు చూడానికో అన్నట్టు వాళ్ళఊరు చేరుకోడం—యివన్నీ యేమి బోధిస్తున్నై? "జీవించడం

అలవాటైపోయింది కాబట్టి జీవిస్తున్నాం; మరణించడం విధిఅయిపోయింది కాబట్టి మరణిస్తున్నాం"— అవియేగా!

ఉచ్ఛ్రాయ పతనాలతో గూడిన సంఘటనల చిత్రమే యిందులోని శిల్పం. ఈ ఘటనలనే ప్రముఖ సన్నివేశాలు అనండి, మన స్తత్వాలు అనండి ఏమైనాగాని, వీటిలో ప్రదీనం, ఉద్దీనం సందీనాలతో గూడిన ఒక క్రమవికాసముంది. అది అనుక్షణ పరివర్తనతో ప్రత్యక్షమయ్యే సన్నివేశాలలో ఉపస్థితమై రాణిస్తోంది. సూక్ష్మంగా వింగడించి పరిశీలిస్తే రోజా మనో వ్యాపారంలో ఏడుదశలు, పైజెప్పిన మాదిరివి, ప్రత్యక్షమౌతై.

## 12. పాపం, నటీమణి :

ఇది వైయక్తికమైన ఒక అపహేళన మాత్రమే!

## 13. మహా వ్యసనం :

కావ్యరచన అనుబంధవృత్తి కావాలిగాని, ప్రధానవృత్తి అయితే నేడు లబ్ధి శూన్యం— అనేదే యిందులోని పిండితార్థం. తనదే పత్రిక, తానే సంపాదకుడూ, అన్నీ తన రచనలే, లేదా —కొన్ని తన్ను గూర్చినవి తానే—ఇలాంటి శ్రీమంతులకైతేనే రచనలు నేడు గిట్టుబాటుగా వున్నై అన్నదే యిందులో ప్రతిపాద్యం.

## 14. వ్యాపారపాఠం :

ఇతర్లను మోసగించమని గుమాస్తాకు నేర్పుతూ యజమానుడు తాను గుమాస్తానే మోసగించి, ఆత్మానుభవం కల్గిస్తాడు గుమాస్తాకు తత్త్వం సుబోధకమయ్యేందుకు.

## 15. మత్కుణోపాఖ్యానం :

తన్ను వెటకారం చేయబోయిన ప్రయాణీకునిపైననే దెబ్బతీస్తాడు స్నేషమూర్తరు. ఇలా వెక్కిరించబోయి వెలికిలబడడమనేది, వైచిత్రి. దీనికి ఉదాహరణంగా, అర్థంతోనేగాక, శిల్పంతోకూడా చెప్పదలచుకున్నాడో కథయిత, అన్నట్లుగా—నల్లులను తిట్టిపోయడంతో ప్రారంభించబడ్డ గల్పిక, నల్లుల గుణగణాల ప్రశంసతో ముగిసింది. ఒక్కటి ముగియగానే పక్కన ఒక్క నవ్వునవ్వి యింకో గల్పిక చదవడం ప్రారంభిస్తాము— అనడానికికూడా యిది నిదర్శనమే!

## 16. జ్ఞానోదయం :

దిక్కూ దివాణం లేనిది యీ మనదేశం. సృష్టికి ప్రతిసృష్టి చేసిన విశ్వామిత్రులనే మించారేమో అహంకారంలో, ఆగ్రహంలోనూ, అనిపించే గ్రంథప్రచురణ వ్యాపారస్థులూ, పత్రికా నిర్వాహకులూ కూడా దీనిలోనే! బ్రహ్మనే తాము సృష్టించాము అంటారు వీళ్ళు. వీళ్ళ సర్వజ్ఞత్వంతో మనకు నష్టంలేదు; కాని వాళ్ళ మోసంతో, ద్వేషంతో చాలా నష్టం వస్తోంది అనేదే దీని ఉద్దేశం.

17. మారుతి మృదంగం :

దీనికి దేసాటి. ఇది శ్రీ పూ. భా. ని శ్రీశ్రీ ప్రభృతుల సమీపాన నిల్పింది. ఇందులోని భాషా విశిష్టతా, ఒక్కొక్కప్పుడు మార్మికమూ ఇంకో అప్పుడు విప్లవాత్మకమూ అని చెప్ప దగిన యోజనావిధానం మొదలైనవన్నీ, శ్రీ పూ. భా. రచనల్లోకెల్లా ఇది పంకోటినంటిందని నిరూపిస్తున్నై. గ్రంథ విస్తర భీతిచే ప్రస్తుతం సంక్షేపించి చెబుతాను—

ఈ మృదంగ ధ్వనివల్ల కల్గిన ప్రథమ తరంగం జీవితయాత్రను, తీరని కొన్ని సాంఘిక దురాచారాలపైని చిన్న దండయాత్రగా భాసింప జేస్తోంది.

రెండో తరంగం, ప్రాతపై రోతను, ఏదో క్రొత్తదని చేయాలనే ఉబలాటాన్నీ సూచిస్తుంది. ఐతే మళ్ళా ఆ అసక్తిలోనే అశక్తి. ఇలాంటి ప్రవృత్తులన్నీ యుద్ధానంతరం ప్రబలేవే!

ఆత్మవంచకులూ, జగద్వంచకులూ అయిన విదేశనాయకులవల్ల గగనకుసుమమైన శాంతిని గురించినది మూడవ తరంగం.

కుల వ్యవస్థయొక్క తత్త్వం తెలియక, కుల దురభిమానాలవల్ల కుమిలిపోయే, లోకంలోని, అశాంతి నాల్గోతరంగంలో ధ్వనిస్తోంది. 'హస్తాలు చాలా ఉన్నాయి; శిరస్సొక్కటల్లే వుంది'— అంటే పద్ధతులు వేరైనా గమ్యం ఒక్కటే అనిన్నీ, బాహిరమైన భిన్నత్వం ఏకత్వంలోనే వ్యవస్థిత మనిన్నీ, ధ్వని.

ఈ అభినందన వాక్యాలు సర్వతోముఖ సమగ్రాలనుకోవద్దని మిమ్ము వీడుకొనేముందు వేడుకొంటున్నాను.



*గేయం :*

# సెలకన్నె

— శ్రీ వై. సి. వి. రెడ్డి

పురివిప్పిన నెమ్మిపిండు
పూజలలో-ఉదయరాగ
పుష్పాంజలి వన్నెలిడగ
పోలికలేనట్టి దివ్య
భావవేగ పరిధులలో
ప్రణయమ్మున ప్రణవముంచి
ప్రణవమ్మున ప్రణయముంచి
అంతా నీవై పొంగుచు
అంతా నీవై పొరలుచు-
యేమమ్మా సెలకన్నె!
యెక్కడనుం డీరాకడ?

అరుణకాంతు లల్లుకొన్న
తరుణభావ సంధ్యలలో
గున్నమావి కొమ్మపైన
గొంతుక సవరించి కోకి
లమ్మ పాడు హాయిపాట
లన్నీ నీ గొంతుకలో

ఒదిగినాయి మెదిగినాయి
యెదలాడెడి నీపాటల
బాటలలో పదములెన్ని
పయనింపగ యనుమతింప
వేమమ్మా సెలకన్నె!
యెక్కడనుం డీ రాకడ?

ఒక విచిత్రపు పత్రపటము
ఒఖ్ఖపై వలెవాటుగాగ
ఒక వినూత్న కాంతిపుంజ
మోసరిలిన కాసెగాగ
ఒక విశుద్ధ ప్రణవశబ్ద
మొత్తిగిలిన యందెగాగ
ఒక వికీర్ణభావజగతి
సకలాత్మగ సాగుచుంటి
వేమమ్మా సెలకన్నె!
యెక్కడనుం డీ రాకడ?



కావ్య సమీక్ష :

# అహల్యా సంక్రందనము

## (సముఖం వెంకట కృష్ణప్ప)

— శ్రీ రావూరు ప్రసన్న సత్యానారాయణ

కాలచక్రమునకు గతి భిన్నత్వము నిసర్గము. అందుచే సమానలక్షణ విలసితమగు కాలము నంతటిని ఒక యుగముగ విభజించుట సహజము. కాల పరిణామము వాఙ్మయము పైనను ప్రభావము నెరపు ననుట సర్వవిదితము. కావున వాఙ్మయమునందు కాలమును అనుసరించి వైలక్షణ్యము ఏర్పడు ననుట నిర్ధారితమైనది. లక్షణసామ్యము గల సాహిత్యమునంతను తత్సర్గకాల దృష్టితో ఒక యుగముగ విభజించుట పొసగును. మన ఆంధ్ర వాఙ్మయమును కూడ అట్లే భిన్నయుగములుగ విభజింపనగును. ఏ యుగసాహిత్యము ఐనను పూర్వాపరయుగసాహిత్యము లక్షణ నిరపేక్షముగ ఉండజాలదు అనుట సమ్మతింపనగు సత్యము. అట్లయ్యును ప్రత్యేకతను నిరూపించు ఒక విశిష్ట లక్షణోపేతమైననే కదా ఒక యుగముగా విభజింపనగును! దక్షిణాంధ్రయుగము గూడ అట్టిదే. కాలపరిమితిని బట్టి సుదీర్ఘము కవితా పరిణతిని బట్టి కడు విలక్షణము నైన యుగమది. రసికశేఖరులైన రాజకవుల పరంపర; సంగీత సాహిత్యములయందు సర్వంకష జ్ఞానమును ఆర్జించిన సారసలోచనలు సైతము సభావేదికల నలంకరించుట. శృంగారపు లాలస నింగి నంటుట; వాఙ్మయ ప్రక్రియా వైవిధ్యమును ప్రదర్శించుట; సంభోగ శృంగార వర్ణనము సమాలంబనీయమగుట; పరకీయ శృంగార వర్ణనము ఉపాదేయమగుట; శృంగారేతర రసములుగూడ ప్రాధాన్యము వహించుట; హాస్యము అంగిరసస్థాయి నందుకొనుట; ఆలంబనవిభావమునకు ప్రాముఖ్యము నిచ్చుట; మానసిక పరిస్థితి వర్ణనాత్మకము, భావప్రధానమునైన శృంగారము వర్ణనీయమగుట; తత్పూర్వయుగపు కవులకు శబ్దముపై నెంతటి చూపు ఉండెడిదో అట్లే యీ యుగపు కవులకు భావముపై ప్రత్యేకపు చూపుండుట; రచనలో వ్యావహారికచ్ఛాయలను చూపుట; వ్యాకరణము నుపేక్షించుట; జాతీయత నధికముగ వ్యక్తమొనర్చుట; వ్యుత్పత్తి, నైతికనిష్ఠ, ప్రామాణ్యము కొరతవహించుట మున్నగునవి ఆ యుగసాహిత్యపు ప్రధానలక్షణములుగ

గోచరింపగలవు. ప్రదర్శింపనంతమాత్రమున ఆ యుగకవులకు వ్యుత్పత్తిలేదని చెప్పజూచుట సాహసమని కొందరు విమర్శకుల అభిప్రాయము. ఏతల్లక్షణోపేతమైన సాహిత్యసృష్టికి తీర్థభూతములైన ఘట్టములు దక్షిణాంధ్రమున తంజావూరు, మధుర, పుదుకోట, జింజి (చెంజి), మైసూరు సంస్థానములు. క్రీ. శ. 1706-32 సంవత్సరములమధ్య మధురనేలిన విజయరంగ చొక్కనాథుని ఆస్థానమున ఉన్నట్టివాడు మన సముఖము వేంకట కృష్ణప్ప. విజయరంగ చొక్కనాథుని 'అంతరంగిక సామాజికుడు'గ కొంత కాలము పనిచేసినట్లు తెలియుచున్నది. విజయరంగ చొక్క నాథునివలన 'గజతురంగ మాందోళికా చ్ఛత్రచామర విజయకాహళ భూరిభేరీ బిరుదధ్వజ' ప్రముఖాదులబడసినట్లు ఆశ్వాసాంతగద్యలయందు స్పష్టముగ చెప్పికొన్నాడు. ''సంగర సవ్యసాచి,' 'సంగర కిరీటి' అను బిరుదములు ఈతనికుండినట్టు తెలియుచున్నది. బాల్యమునందే మధురోర్వీనాథుని మెప్పించినాడట. సంగరమునందే కాక సాహిత్యమునందును ఉభయభాషలయందును సవ్యసాచియైనట్లు గ్రహింపనగును. గ్రంథావలోకనమున శశాంకవిజయకర్త శేషము వెంకటపతియు, బుడిగె కృష్ణ కవీంద్రుడు ఈతని కాప్తసఖులని చెప్పుకొన్నాడు. జైమిని భారతము అను వచన కావ్యమును, సారంగధరచరిత్రము అను ఆశ్వాసత్రయ ప్రబంధమును, రాధికాసాంత్వనము అను ఏకాశ్వాస ప్రబంధము—ఈతని యితరరచనలైనట్లు తెలియుచున్నది.

పరకీయ శృంగార వర్ణనమునకు పట్టుకొమ్మలై నిలిచిన వారిలో ప్రఖ్యాతలు రాధిక అహల్య తారలు అని చెప్పవచ్చును. పరపురుషునితోడి శృంగార గోష్ఠియందు వీరి ముగ్గురికి అత్యంతము సామ్యము గలదు. రసిక శేఖరులు శృంగారశూరులునైన కవుల చేతిలోబడి ఈ గాథలు మఱియు వన్నెకెక్కినవి.

అహల్యాసంక్రందనమునందలి కథావస్తువు ప్రఖ్యాతము. దేవేంద్రుని సభలో ఒకనాడు అచ్చర మచ్చెకంటులలో మిగుల సౌందర్యవతి యెవ్వరు అను ప్రశ్న జనించినది. సభాసదులగు మునులును దేవతలును వారివారి అభిరుచుల ననుసరించి మక్కువగలవారి నామములు చెప్పిరి. అంత వారిలో ఒకరి

---

1. చూ. బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి "తంజావూరి ఆంధ్రరాజుల చరిత్ర." పుటలు 28-31.

కొకరికి వాదులాట ఆరంభమైనది. తుదకు అది కొంతవరకు కచాకచి కదనో త్కంఠమైనది. కాని మధ్యవర్తుల మాటలచే సమసిపోయినది. తరువాత ఇంద్రు డొకనాడు బ్రహ్మసముఖమునకేగి అప్సరోఽంగనలలో మిక్కిలి సౌందర్యవు టిక్కయగు దానిని చెప్పుడని ప్రార్థించినాడు. తన మదికి నించిన యింతి యతఃపూర్వసృష్టియందు లేదనిచెప్పి తనకు నచ్చినవిధముగ ఒక లేమను సృజించి నాడు బ్రహ్మ. ఆమె సౌందర్యము త్రిలోకముల ముగ్ధమొనర్పగల్గినది. ఇంద్రుడు ఆమెను మనసారగ ప్రేమించి. తానే దానికి తగిన భర్తనని నిర్ణ యించుకొని, తన ప్రేమను వ్యంగ్యముగ ఎన్ని మాటలలో వ్యక్తము చేసినను లాభములేక తుదకు తనకుఇమ్మని అర్థించినాడు. కాని బ్రహ్మ ఇంద్రునకు ఇయ్యక ఆమెను గౌతము నొద్దకు పంపినాడు. గౌతమునికి పరిచర్య సేయు చుండినను ఆమె ఇంద్రునే తలచుకొనుచుండినది. ఇంద్రుడుగూడ గౌతముని ఇంటికి రాకపోకలు సాగింప మొదలిడినాడు. ఒక జటిసీమంతి రూపమున పగు దెంచి ఆమెహృదయము సుముఖముగ ఉన్నట్లెరిగి కొలదిదినముల అనంతరము కుక్కుటమైకుంసి గౌతముని వేషమున ఆమెను కలిసినాడు. ఇంద్రుడు అండవిహీనుడగునట్లు గౌతముడు శపించుట - అహల్య రాయి యగుట- శాపవిమోచనోదంతము - అహల్యాగౌతముల పునస్సమాగమముతో గ్రంథము ముగియుచున్నది.

ఆంధ్రవాఙ్మయమువందు శృగారప్రధానములయి వాసికెక్కిన కతిపయ కావ్యజాలములో ఈ అహల్యాసంక్రందనము ఒక ఉత్తమ స్థానమును సంపా దించుకొన్నది. శృంగార ప్రధానమగు గ్రంథజాలము అనుటతోడనే శృంగార రసప్రధాన కావ్యము అను స్ఫురణముగల్గుట సహజము. కాని రసాభాసము రక్తిగట్టిన కావ్యరాజమిది. రసముయొక్క ఆభాసమే రసాభాసము. అనగా రసమువలెనే భాసించుమగాని రసముమాత్రము కాదని యర్థము. రసపోష ణముకంటె రసాభాసపోషణము కష్టతరమందురు.

**తల్లక్షణము :** మన పండితులు తఱచుగ పేర్కొను ప్రతాప రుద్రీయ శ్లోకము

ఏకత్రైవానురాగశ్చే త్తిర్యఙ్మ్లేచ్ఛగతోఽపి వా
యోషితో బహు సక్తిశ్చే ద్రసాభాస స్త్రిధా మతః.

ప్రకారము ఇందలిది రసాభాసమగుటకు అవకాశము ఎట్లును కాన్పిం పదు. ఇట అహల్యాసంక్రందనులయందు అనురాగము ఉభయనిష్ఠము. వారి

మధురబాంధవ్యము పూర్వరాగ ప్రేరితము. ఇంద్రుని ప్రశ్నవలననే అహల్యను సృజించినాడు బ్రహ్మ. అహల్యాసంక్రందను లొకరినొకరు చూచికొని పరస్పర లగ్నహృదయులైనారు ఆ క్షణముననే. కావున 'ఏకత్రైవాను రాగ'ము అనులక్షణ మిట పట్టదు. వారు తిర్యక్కులును మ్లేచ్ఛులును కాకుండుట స్పష్టము. ఇంక 'యోషితో బహిసక్తిశ్చేత్' అనునది యేమైనవర్తించునా యని విచారింపవలయును. ఇట అహల్యాసంక్రందనుల సమాగమమునకు కారణము అహల్యకుగల బహుసక్తి కాదు అని చెప్పుటయే సమంజసమని తోచెడిని. జన్మమొందినది మొదలు ప్రేమించినవ్యక్తి ఇంద్రుడు. అకలంకమగు ప్రేమము అతనిపైనే కలదు ఆమెకు. బ్రహ్మ ఆజ్ఞవలన మాత్రమే గౌతముని సేవించుచుండినది. గౌతమునిపై నున్నది కేవలము భక్తిమాత్రమే అని ఇందు కవి స్పష్టముగా ప్రతిపాదించినాడు అందుచే ఇది నారిబహుసక్తి కాదు. ఆకారణమున ఇది రసాభాసమనుట పొసగదు. కాని జగన్నాథ పండితుని మతానుసారము మాత్రము ఇది రసాభాసము కాక తప్పదు. 'అనుచిత విభావాలంబనత్వం రసాభాసత్వమ్' అని అతని వక్కాణ. అనుచిత విభావాలంబనమై ప్రవర్తిల్లిన రతి రసాభాసమగు ననుట స్పష్టము. "అనుచిత" పదమునకు లోక మర్యాదాతిక్రమణము అను నర్థము పరిగ్రహణీయము. అహల్యాసంక్రందనుల సమావేశము పూర్వరాగ ప్రేరితమే. అయినను ఒక వ్యక్తికి భార్యయైన పిదప మరియొకనితోడి పొందు స్త్రీకి లోకమర్యాదానుగుణముగ నిషిద్ధము. అందుచే ఇది రసాభాస మనుటకు సందేహింప నక్కరలేదు.

వాల్మీకీయమునకు భిన్నముగ ఈతడు కావించిన కల్పనలు ప్రధానము నప్రధానము నైనవి పెక్కులు. అత్యంత ప్రధానము, రమణీయతమమునైన కల్పనము ఇంద్రునికొరకునై అహల్య సృజింపబడెననుట. ఇంద్రుడు అహల్యను మోసగించెనని అహల్యపాత్రను పెక్కురు కవులు సమర్థింప యత్నించినారు. కాని వారి సమాగమము పూర్వరాగ ప్రేరితమనియు అహల్య కేవలము శక్రుని కొఱకే సృజింపబడినదనియు ఆమె ఆదినుండి ఇంద్రునిపైనే అనురక్తయై యుండెననియు గౌతమునెడ కేవలము భక్తిభావముతో మాత్రమే యుండెననియు అందుచే అహల్యాసంక్రందనుల సమాగమమున దోషము ఆవంతయు లేదనియు సమర్థింప యత్న మొనర్చినాడు సముఖము. నిర్వహణము మేలిరముగనే సాగినది.

పాత్రపోషణము పటిష్ఠముగనే సాగినదనిచెప్పవచ్చును. ఇందు అహల్యా సంక్రందనులు నాయికా నాయకులు అనుట స్పష్టము. అహల్యను అతఃపూర్వ సౌందర్యవతులకంటె అత్యున్నతమగు స్థాయియందు చిత్రింపదలచినాడు. కాని ఔపమ్యసామగ్రి క్రొత్తది తెచ్చుట కష్టతరమైనది. తుదకు పూర్వుల మార్గముననే

చందురులో మైల జలజంబులో దువ్వ
యూడ్చి పోఁద్రోచి రెండొకటిసేసి
అరుణాశ్మకాఠిన్య మమృతపాండుగుణంబు
నుడిగించి యా రెండు నొకటిసేసి
అరులతో డెడయించి గిరుల ప్రతాపంబు
పెకలించి యా రెంటి నొకటిసేసి
యిభతుండ చాతుర్య మిల ననంటుల జాడ్య
మొడిచి యా రెంటిఁ దా నొకటిచేసి

సృజించెనని వైచిత్రితో ఉక్త మొనర్చినాడు. పతివ్రతాధర్మమున పతితయైనను భావము పవిత్రమగుటచే (కారణము పూర్వరాగప్రేరితమగుట) ఆమె నిష్కలంక యైనట్లే చిత్రింపబడినది. అందులకు ఉపబలముగ సమాగమ సన్నివేశ వర్ణనాత్పూర్వము తృతీయాశ్వాసాదియందు.

'......మదికిన్
హాయి దలిర్పఁగ వైశం
పాయనుఁ డిట్లనియె లోకపావనచరితన్.'

అని చెప్పినాడు. వైశంపాయనుడు సంయమివర్యుడగుట సర్వ సమ్మతము. రాగద్వేషములు రహితములగును సంయమనముచే. కావున సంయమి భావములును వాక్కును పక్షపాతయుతములనుట సాహసమనుకొందును. అట్టి వైశంపాయనునికి కథన మొనర్చుట మిక్కిలి హాయిని గూర్చినదనుటయందు అది నిష్కలంకమైనదని చెప్పకయే చెప్పినట్లగును. అట్లు ఊహింపవలసిన యావశ్యకము లేకుండగనే 'లోకపావన చరితన్' అని వాచ్యముగనే చెప్పినాడు కవి. ఆమె దోషమునందు సామంజస్య ముండుటవలననే గౌతముడు పునర్గ్రహణ మొనర్చినాడు. ఇంద్రునిపాత్రయు కొంతవరకు ఉత్తమ మార్గముననే పోషింపబడినదని చెప్పవచ్చును. కాని కేవలము కామప్రకోప ప్రశమనార్థము సర్వదైవత కులాధిపుడు ఒక కోడియై కూసెననుట అంత ఉచితమై

నట్లుగా తోపదు. భావనయందు వైలక్షణ్యమును ప్రదర్శించిన దక్షిణాంధ్ర యుగముననైనను దీనిని మార్పుచేసినచో బాగుండెడిదేమో! ఇంక గౌతముని పాత్రయు సంయమిసహజముగనే పోషింపబడినది. ఇంద్రసభయందు కేవలము అచ్చరల సౌందర్య నిర్ణయమునకై హేయనుగు దేహసౌందర్యమును గూర్చిన వివాదమును అట్టి స్థాయియందు సాగించిన తేలిక మానుసులుగా మౌనులను చిత్రించుట అనుచితమనియే పలువురు పండిత విమర్శకుల అభిప్రాయము. అహల్యా సౌందర్యము లోకోత్తరమను స్ఫురణకు హేతువు కావచ్చును. కవి చమత్కార ప్రియత్వమునకు హాస్యచతురాస్యు డనుటకు రసిక శేఖరు డనుటకు సాక్ష్యము అందు లభించిన లభింపవచ్చును. కాని వివాదోద్ధతియందు అత్యుగ్రుడైన కౌశికుడు జపమాలను అవల పారవైచుట అనుచితమనుట సాహసము కాదనుకొందును. ఎంత కవిత్వమైనను ఆర్షధర్మమున కపకర్ష నాపాదింప జూచుట సమంజసమా! తాను పదిసంవత్సరములు మేనకతో వసించితినని దేవేంద్రసభయందు చెప్పునా! ఆమె సౌందర్య సమర్థనమే ప్రధానాశయమైనను అట్లు వాచ్యముగా చెప్పునా! ఆత్మాపకర్ష నాపాదించు ఆ వాక్కులను బల్కునంతటి దమరాహిత్యమును ప్రదర్శించినట్లు చెప్పుట యేమి యుచితము?

రసాభాస పోషణము రమణీయముగనే ఉండునట్లు జాగ్రత్త వహించి నాడు కవి. గౌతముని వేషమున ప్రవేశించుచునే ఇంద్రుడు:

'కొమ్మ! యొక పుంజు తనపెంటికోడిఁ దలఁచి
కూసెఁ గాకది వేకువ కోడిగాదు
ప్రొద్దువోడవంగఁ దద్దయుఁ బ్రొద్దుగలదు
ముద్దుగా శయ్య కరుదెమ్ము! ముద్దుగుమ్మ!'

అని ప్రథమముననే, అతఃపూర్వము ఒక జాము కాలముక్రింద ఆమె రత్యభిలాషను వెల్లడింప గౌతము డొడంబడకుండుటను దివ్యదృష్టితోనైనను గ్రహింపలేక 'శయ్య కరుదెమ్ము' అనుటయందే శంక గల్గించినాడు కథాశిల్పమున నిదియొక లోపమేమో! అవులించిన త్రేపులు లెక్కపెట్టగలది అహల్య. శతమన్యుడేమో అను శంకయే ఆమెకు మొదట కల్గినది. ఆగమన కారణము తెలిపి పలువిధముల ప్రార్థించినాడు. తుదకు కాళ్ళ బేరమునకు వచ్చినది వ్యవహారము. 'దేవుడ వేలినసామివి! పోవయ్యా' అని అనుకంపాన్విత హృదయమును వ్యక్తమొనర్చుచు 'గుబ్బచనుమొన లావిభునెదసోఁక' వెత్తి

నదట. ఎత్తిన పట్టువీడక కుచపాళిపై నత్తమిల్లినాడు శచీశ్వరుడు. ఇరువురును మన్మథ బ్రహ్మానంద మగ్నులైనారు. భావము లొక్కటైనవి. నీవు నేనను భేదము నశించినది. అనిర్వచనీయము అఖండమునగు సుఖముప్పతిల్లినది. ఇట్లుండగనే వేకువజాము తోచినది. వదలలేక వదలలేక యెట్లో వెడలినాడు ఇంద్రుడు - శాపోపహతుడైనాడు. ఇందు కవి తన ఉద్యోగప్రవృత్తితత్వము లోనివైన మల్లబంధ విశేషములనుగూడ కవిత్వములో భంగ్యంతరముగ ప్రవేశ పెట్టి సార్థకత్వమును చేకూర్చుకొనినాడు.

'సకల కలి కలుషతిమిర భాస్కరోదయంబును, నుల్లసితసంపత్పల్లవ వాసంతికావాసంబును, నవరస నిగూఢ గంభీరంబునుంగా' కావ్యముండ వలయునని కవి తలంపైనట్లు స్పష్టము. ఇందు నవరస నిగూఢంబుగా నమట కేవల ముపలక్షణమాత్రమైనట్లు గ్రహింపనగును. తెలుగు కవులయందు కవిత్రయము, భాస్కరుడు, సోమునిపై గౌరవభావము. అట్లని తక్కిన కవులపై తక్కువ చూపున్నదని చెప్పుటకు వీలులేదు.

రచనము సమర్థముగను పటిష్ఠముగనే సాగినది. జాతి, వార్తా, చమత్కార ప్రదర్శనముపై ప్రత్యేకదృష్టి నునిచిన కవులలో అగ్రస్థానీయులు దక్షిణాంధ్ర యుగకవులు. దక్షిణాంధ్రయుగకవులయందు ప్రథమశ్రేణిలో గణింపదగిన యీ కవియు వానిని సందర్భోచితముగను, స్ఫూర్తిమంతముగను ప్రదర్శించినాడనుట కేవల స్వభావోక్తి. ఈ గ్రంథమందలి జాతి, వార్తా, చమత్కార చారుత్వమును దర్శించుట ఆ పదముల అర్థవైశాల్యము నించుక సమీక్షించుట యవశ్యమని తలతును.స్వభావోక్తియే జాతి యనవచ్చును 'స్వభావోక్తి రసౌ చారు యథావ ద్వస్తువర్ణనమ్' అని యొక నిర్వచనము. స్వభావోక్తి స్వభావస్య జాత్యాదిస్థస్య వర్ణనమ్' అని మఱియొక లక్షణము. యథావద్వస్తువర్ణనమే స్వభావోక్తి. కాని కొన్ని వస్తువుల యథార్థ వర్ణనము జుగుప్సను గల్గించును. అందువలననే 'చారు' అని జాగ్రత్త వహించినారు ఆలంకారికులు. రమణీయమైన వస్తువు యొక్క యథార్థ వర్ణనమే స్వభావోక్తి. నిరలంకృతమై, సాహిత్య ప్రతిపత్తి సాధకములలోనివైన శయ్యావైగనిగ్యము పదబంధనా చాతురి మున్నగునవి లేక, కథా సన్నివేశమును, సందర్భోచితిని, పాత్ర స్వభావము మున్నగు వానిని పురస్కరించుకొని మఱియొక పాత్రతోడి ప్రసంగ సందర్భమున ప్రవర్తిల్లినటువంటి భావాశ్రయమైన చమత్కారమే వార్త అనవచ్చును.

ఆంగ్లమున సంక్షిప్తముగ 'A pointed expression without any literary exuberance' అని చెప్పవచ్చును. వార్తలాడుట అని ప్రయోగము. ఇక చమత్కారము అనునది పలువిధములు. అర్థాశ్రయమైన చమత్కారము శబ్దాశ్రయమైన చమత్కారము నని స్థూలముగ ద్విధా విభజింపనగును. సందర్భమును చమత్కరించుట కవి సమయములు, లోకోక్తులు, నుడికారములు సామెతలు అలంకారములు మున్నగువానిని చమత్కరించుట అర్థాశ్రయమైన చమత్కారము క్రిందికి వచ్చును. యమకము ఛేకానుప్రాసాదుల ప్రయోగించి చమత్కరించుట శబ్దాశ్రయమైన చమత్కారము క్రిందికి వచ్చును. పైన చెప్పిన జాతి వార్తాచమత్కారములకు క్రమముగ ఉదాహృతులను పరిశీలింతము.

'ఉంఛ ధాన్య సమర్పితోర్వరా ధీశార్హ
          షష్ఠ భాగాంకిత సైకతంబు
త్రిషవణాప్లుత మౌని ధృత వల్కలాంచల
          పృషత చంద్రక వర్జ్ఝరితటంబు
ముని బాలకానీత పునరంకుర త్కుశ
          శ్యామికా కోమల శ్యామలంబు
పృషదాజ్య హోమ సమేధమాన హుతాశ
          ధూమగంధావృత వ్యోమభాగ
మతిథి పూజార్హ వస్తు సమార్జనైక
సంగ్రహావ్యగ్ర గృహమేధి సంకులంబు
శాంతము నగణ్య పుణ్య నిశాంతమగుచు.'

గౌతముని ఆశ్రమ ముండెనని వర్ణించుట స్వభావోక్తి సుభగముగ నున్నది. ఇట్లే అహల్యా సంక్రందనుల సంభాషణము గూడ మిక్కిలి యథార్థముగ సాగినది.

అహల్యా సౌందర్యాకృష్టుడై ఆమె యింటికి రాకపోకలు కావించు నింద్రునితో ఒకనాడు ఆమె యొనర్చిన సంభాషణము సంవాదాత్మకశైలిలో

'ఎవరది యింటిలోపల ? నదెవ్వరు ? శక్రుఁడ ! చెల్ల మీరలా
యివలికిరండు ; నీదు మగఁడెక్కడ ? మూలఫలార్థమేఁగె ; రా
నువిదరో ! తామసంబగునొ ? ఉండుఁడు, పూజలుగాంచిపొండు; సే
యవలయుఁబూజ నీవెఱుగవా ? యన సిగ్గుననేఁగు నవ్వుచున్'

ఇట అహల్యా సంక్రందను లొకరిపైనొకరు ప్రేమనుగల్గియుండియు 'ముఖా ముఖి' వ్యక్తము చేయజాలకపోవు సందర్భము. యాదృచ్ఛికముగ, మునిలేని తఱి పరస్పరము మనోగతభావములను వెల్లడింప నవకాశము లభించినది. 'పూజలు గాంచిపొందు' అని అహల్యపల్కగ నే 'సేయవలయుఁబూజ నీ వెఱుఁగవా' అని యింద్రుడు పల్కుటయందలిభావము అహల్యకు మాత్రము తెలియును. ఆమె సిగ్గు యందలి అంగీకారభావము ఇంద్రునికి తెలియును. అదియు సందర్భమును బట్టి ఊహింపదగినది.సూటిగ నిరలంకృతమై కథా సందర్భమును సందర్భౌచితిని పురస్కరించుకొని యిరువురు పాత్రల ప్రసంగ సందర్భమున ప్రవర్తిల్లిన భావాశ్రయమైన చమత్కారము కావున ఇది వార్తకు ఉదాహరణము కాకపోదనుకొందును.

ఇక చమత్కారము భావాశ్రయమగుటకు :

అహల్య సృజింప బడగనే ఆమె సౌందర్యమునకు ముగ్ధుడైన ఇంద్రుడు. బ్రహ్మతో 'చక్కదనాల కుప్పయగు చక్కెరబొమ్మను సృష్టిచేయుటే యెక్కువగాదు; ...' అనుటయందు ఇంద్రునికి ఆమెపైగల మమకారము వ్యక్తము సేయబడుచు సందర్భము చక్కగ చమత్కరింపబడినదనవచ్చును.

"అలికచమోముబోలను సుధాంశు సరోజము లొక్కపుష్కర
స్థలమునఁ బ్రార్థనల్ సలుపఁ జంద్రుఁడు పొందెఁ బ్రసాదమంత లో
పల బహురాజపాన మధుపస్పరిశంబున యోగభంగమై
జలజ మటుండెఁ గానియెడఁ జందురునింగని సైఁచియుండునే"

అనుటలో బద్మమునకు చంద్రునకు విరోధము అను కవి సమయము చక్కగ చమత్కరింపబడినదని తలపవచ్చును.

అప్సరసౌందర్య నిర్ణయసమావేశమున దేవతలకు మునులకు ఒకరిలో ఒకరికి వాదులాట ఆరంభమై తీవ్రరూపము దాల్చినది. అది శమించుజాడ కాన్పింపలేదు. "అచ్చరమచ్చెకంటులకునై కడు హెచ్చిన మచ్చరంబుతో .... వివేకముల్లెల్లను వెచ్చపెట్టి" యిట్లు వివాదమునకు దిగిరేయని విచారించి యెట్లైనను ఆపవలయునని తలచి యింద్రుడు

"ఏ కాంత యెవరి కితవో
యాకాంతను వారు పొగడు టది యుక్తంబే
మీకేల వాదు మీలో
'లోకోభిన్నరుచి' యనెడి శ్లోకము వినరే"

అని అనును. ఇందు 'లోకోభిన్నరుచిః' అనెడి లోకోక్తి బాగుగ చమత్కరింప బడుట స్పష్టము. సామెతలు జాతీయములు నుడికారములు అటనట చమత్క రింపబడకపోలేదు. ఉదాహరణమునకు ఇంద్రుడు అహల్యను తనకిమ్మనికోరగా బ్రహ్మ 'నీకునీవె పడ్డించుకొనన్ దగునే' అనుట; ఇంద్రుడు అహల్యకొఱకయి తిరుగుట 'ఆసు పోసినరీతి' నుండెననుట* మున్నగు వానిని కొనవచ్చును.

అహల్య 'చిన్ని పదముల హలరేఖ చేత సీత,
దీలు పడు కౌనుచేత విదేహజాత,
గోము మీఱిన కటి చేత భూమి పుత్రి'

అనుట యందు సీత విదేహజాత భూమిపుత్రి అను పదములు చమత్కరింప బడిన వనవచ్చును.

ఇంక అనుప్రాసాద్యలంకారములు అతిమాత్రముగను అతి రమణీయ ముగను ఉపయోగింప బడినవి. శబ్దముపై లాలసయందును కవి కొంత చూపును ఉంచకపోలేదని చెప్పనగును.

నాగంబుల నాగంబుల
నాగంబుల గెల్చు కురులు నాభియుఁ దొడలున్
భోగంబుల భోగంబుల
భోగంబులఁ దరుణి యూరు బొమచను లేలున్.

'బార సూరులు సలిపిరి బారసూరు
లాగమంబుల నుతియింప నాగమంబు'
'తూపు రూపు మాపుఁ దొయ్యలి నునుఁ జూపు
సోము గోము నోము భామ మోము'
'ఎనఁగాన జగాన మొగానఁ బల్కెదన్'

త్రిమ్మరి తెమ్మెర క్రమ్మఁగొమ్మరో'
'గిన్నెలతో నెలతో లతోన్నతిన్
కందరమై దరమై రమైక్యమై
కోయిలకో యిలకో లకోరకో'

మున్నగు పంక్తులు శబ్దాలంకార ప్రయోగ సామర్థ్యమునకు మచ్చుతునకలు.

---

* 'రాజానుమతో దర్శో', 'చల్లకువచ్చి ముంతదాఁచురే'
'దూరపుఁగొండలు మనుపు', 'ఉకము మొగముగోటు (సుకుమారి మాటలు)'
'పంగుఁడైనట్టి జనుఁడేఁద గంగయేఁద'
'పుట్టపియట్టి బిడ్డలకుఁ బూసలు గట్టుదురు'

ఈకవి విజయ విలాసమును బహువారములు మననముచేసి యుండ బోలు ననుటకు ఇందలి పెక్కుపద్యములు సాక్ష్యము చెప్పగలవు.

ఒక్క ఉదాహరణము :

కుసుమ సమూహవాసనలఁ గుల్కెడు నీలతకూన యొక్క తా
పస తరుఁ జేర వచ్చె నదె పద్మదళాయతనేత్రి! కంటివా
కుసుమ సమూహ వాసనలఁ గుల్కెడు నీ లతకూన యొక్క తా
పస తరుఁ జేరి యుండుటిది పద్మజు నానతిఁగాదె కోమలీ!

అను పద్యము

విహరించున్ మలయానిలం బచటఁ దావిం జిల్కె నెమ్మేనిపై
విహరించున్ పికనాదముల్ చెవికిఁ గావించుంజవుల్ పోదమా!
సహకారాళి పదంబుఁ జూడఁగ వయస్యా హాళివాటిల్లెడున్
సహకారాళిపదంబుఁ జూడఁగ వయస్యా హాళి యౌనేకదా!

అను విజయవిలాసపు పద్యమును మనసున నుంచుకొని వ్రాయబడిన దనక తప్పదు.

పైన శబ్దాలంకారములకు ఉదాహృతములైన పద్యములు పద్యపాదములుగూడ నిదర్శనములు కాగలవు.

ఇంద్రుని విరహవర్ణనమునకు వసురాజు విరహవర్ణనమును మేలుబంతిగా నిడికొనియెనా యని అనిపింప గలదు.

ఉదాహరణమునకు :

"మగువ పాదములని చిగురుటాకుల నెత్తు
సఖియూరులని కదళికల హత్తు
సతి నితంబంబని సైకతస్థలి వ్రాలు
చెలువ వళులని వీచికలను దేలు .. మున్నగు

పంక్తులు వ్రాయునపుడు

"కనుగొంటి లతకూన నని డాయుఁ గాకున్న
నభినవ తరలతావాప్తిఁ దెలుపుఁ
గంటిఁ బద్మిని నని గమకించుఁ గాకున్నఁ
బరితాప గరిమఁ దామరలఁ జూచు ..."

మున్నగు వసుచరిత్రయందలి పద్యపాదములు స్మృతియందుండె ననక తప్పదు.

'తరుణీ విలాసముల ధీరుల చిత్తము తత్తరిల్లునే' అను పద్యపాదము 'కలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్' అను మనుచరిత్ర పంక్తిని జ్ఞప్తి కెలయింపక మానదు.

"ఎందును సంచరింప కఖిలేంద్రియముల్ సుఖమొంద డెందమున్
బొందుగఁ దన్నుఁ దా మఱవ ..."

అనునది

"ఎందే డెందము గందళింప రహిచే నానందమున్ నిర్వృతిన్
జెందున్ ..."

అను మనుచరిత్ర పంక్తులను స్మృతికి తేగలదు.

వర్ణనాత్మకమైన శైలీ ప్రాచుర్యము ఇందు కాన్పించును. సంవాదాత్మకమైన శైలియు అతి సరసముగ నడపినాడు సముఖము.

ఉదాహరణమునకు :

"ఎవరది యింటిలోపల ? నదెవ్వరు ? శక్రుఁడ ; చెల్ల ! మీరలా
ఇవలికి రండు;..." మున్నగు వానిని తీసికొనవచ్చును ఇంక ఆఖ్యాన శైలికి కథాసంవిధానమును బట్టియే కొలది అవకాశము కలదనుట స్పష్టము. వర్ణనలు స్వభావమునకు సన్నిహితముగ నుంఁడవలయునని అధికముగ శ్రమ యొనర్చినట్లు తెల్లముకాగలదు. కల్పనా శిల్పముగూడ ఒక మాదిరిగ ఉత్తమముగనే ఉన్నదనవచ్చును.

దక్షిణాంధ్ర యుగకవి సహజములైన వ్యాకరణ విశేషములు ఇందును గలవు. కారణము వ్యాకరణమూకవులకు రాక కాదు. దానిపై నంత ప్రత్యయము లేకయే. వైయాకరణైకవేద్యములగు ప్రయోగము లొనర్చిన యాకవులయెడ పైయభిప్రాయము గొనుట సమంజసమనియే యనుకొందును.

ఉదా :

"మోము కప్పున్నమః పలనె; కూఁతురికెన ; ఉంద్రా యథాధమః మగవాఁడైతే కండ్లు ఎఱచేసి; పదివేలయినా: ఊల్కొన నీకన్" మొదలగునవి, 'నేను' అనుటకు బదులుగ 'తాను' అని వాడుట దక్షిణాంధ్రయుగకవి సహజమైనదే.

'ఱొమ్ము పట్టవు కుచముల్; ఎఱకలను గట్టుకొనియైన నెగసివచ్చి తన యెదనువ్రాలనా చిల్కతాళివలెను' మున్నగు వ్యక్తీకరణములు (Express-

ions) విశిష్టముగనున్న వనవచ్చును. శాపమునుండి అహల్య నివృత్తిచెందు నపుడు ఒక్కమాఱుగ ఆడుదియై నిల్చెనని చెప్పకుండ క్రమముగ స్త్రీగ మాఱి నట్లు వర్ణించుట ఒకవిశిష్టత అనవచ్చును. అహల్యా సౌందర్యమునుచూచి సరస్వతియు అప్సరసలును తాము మగవారము కామైతిమని తలచిరనుట మిక్కిలి సహజముగ నున్నదనవచ్చును.

'మెలఁత మైజిగిఁ బోలు మెఱుఁగు జూచెదనన్న
నింపొందఁ గందోయి యెదుట నిలదు'

అను పద్యమున 'అభిలషితమైన వస్తువు లభింపని యపుడు తత్సదృశమైనదానివలన కొంత తృప్తి లభించును' అను మానసికతత్త్వశాస్త్రమర్మమును చక్కగా పొందుపరిచినాడు కవి. పామును బట్టెద నే నా భూమిని నూఁగారు కెందుఁబ్రతిలేదనుచున్' అనుట ఆనాటి సవాలుచేయు పద్ధతిని తెల్పుచున్న దన వచ్చును.

ఇంద్ర సభయందలి జగడమును అందును కుబేరనందనునికి చంద్రుని మనుమనికిని వచ్చిన జగడమును సజీవముగ వర్ణించినాడు కవి. అహల్యా సమాగమానంతరము ఇంద్రుడు ప్రక్కలు చూచుచు పోవుచుండెననుట చాల సహజముగ నున్నది.

కాని ఎదుట సరస్వతియు ఇంద్రుడు నుండగా 'కన్నులై తేసరే, చన్నులై తేసరే' అని యిట్లు బ్రహ్మగారు తానుసృజించిన స్త్రీ సౌందర్యమును వర్ణించెననుట అంజసమంజసమాయని అనిపించెడిని. ఒకవేళ బ్రహ్మపైగలభక్తి ప్రపత్తివలన సరస్వతి ఊరకుండెనని నను ప్రేమతో తనకుగల చనవును పురస్కరించుకొని 'ఊరకుండుము' అనినైన పల్కక బెల్లముకొట్టిన రాయివలె కదలక మెదలక ఉండెనా ? ఆమాత్రమైన ఆమెకు బ్రహ్మయొద్ద చనవులేదని చెప్ప జూచినచో సాహసమే యగునేమో !

ఇట్లా యుగసహజములగు కతిపయానౌచిత్యములు వినా, పాత్రపోషణము, శైలి, వర్ణనలు జాతివార్తా చమత్కారములు, కల్పనాశిల్పము మున్నగు కావ్యగుణము లన్నిట మిక్కిలి ప్రత్యేకతను ప్రదర్శించినాడనియే చెప్పవలెను సముఖము. ముద్దుపళనివంటి రసికురాలినే మురిపించిన కవిత్వ మాతనిది.



## పుస్తక సమీక్ష :

# ఆంధ్రాభ్యుదయము

రచన:
శ్రీమతి త్రిపురనేని జయప్రదాదేవి
వెల రు. 1-25

ప్రతులకు:
శ్రీ త్రిపురనేని సుబ్బారావు,
97, MC. మలకపేట, హైదరాబాదు.

రామస్వామి చౌదరిగారిని గురించిన ఒక వ్యాసము, పారిజాతము, విజయ విలాసములమీద సులభంగా సామాన్య జనరంజకంగా వ్రాసిన రెండు వ్యాసాలూ, కందుకూరి, గురజాడాది పెద్దలయొక్క కొద్ది పరిచయంతో ఒక సంస్మరణ, మహాంధ్రోద్యమము అనే పేరుతో జాతీయపోరాటంనుండి ఆంధ్రావతరణము వరకుగల ఒక వివరణ, గోపీచందుగారి కథలనుగురించిన అతిక్లుప్తమైన వ్యాసము మొత్తముకలిపి ఆరువ్యాసముల సంపుటి ఇది.

భాష సరళముగానూ, పఠనయోగ్యముగానూ ఉన్నది. దుర్లభ విషయములు సులభంగా, సులభవిషయములు వివరంగా చెప్పబడినవి. ఇవి పత్రిక కొరకు వ్రాయబడిన వ్యాసాలుఅవడంచేత పాఠకులకు మిక్కిలి ఉపయోగపడును.

—మహేశ్వర్.

# శృంగార తరంగిణి

గ్రంథకర్త:
శ్రీ అక్కిరాజు వేంకటేశ్వరశర్మ.
పుటలు 63 : వెల రు. 1-4-0

ప్రతులకు:
గ్రంథకర్త, పండితులు.
ఏ. సి. కాలేజి, గుంటూరు.

ఇది సంస్కృతములోని అమరుక కావ్యమునకు తెలుగుసేత. మూలకావ్యముసయితము చేర్చబడినది. ఈ ఆంధ్రానువాదము ప్రశస్తముగా నున్నదని మహామహులయిన పండితులు అభిప్రాయ మిచ్చియున్నారు. అట్టిప్రశంసకు ఈకవులు ఎంతయు తగియున్నారు. పద్యములు రసోచితములయి, ప్రవాహగతి గలిగియున్నవి. అయితే, ఇప్పటికే ఈ అమరుక కావ్యమునకు రెండు డజనుల అనువాదములు వెలసియున్నవి గదా! ఇంత ప్రతిభావ్యుత్పత్తులుగల ఈ కవిశేఖరులు అనువాదముల వంకకుపోక, సంస్కృతాంగ్ల సాహిత్యముల పోలిక స్వతంత్ర రచనలకు పూనుకొన్నయెడల ఆంధ్రసాహిత్య యోషామణికి అనర్ఘాలంకారశోభ గలుగకుండునా ?

—ద. సూర్యప్రకాశరావు.

## దక్షిణభారత హిందీ ప్రచార సభ - ఆంధ్ర

ఖైరతాబాదు - హైదరాబాదు-4

### మా తెలుగు ప్రచురణలు

| | | |
|---|---|---|
| నెలవంక | .... | రు. 2-00 |
| ప్రహ్లాదచరిత్రము | .... | 1-50 |
| శ్రీకృష్ణరాయబారము | .... | 1-50 |
| కథాతో[illegible] | .... | 2-00 |
| కావ్యతోరణము | .... | 1-50 |
| హిమబిందు | .... | 2-50 |
| ప్రతిజ్ఞాయౌగంధరాయణము - స్వప్నవాసవదత్త | | 1-50 |
| దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు జీవితము (మొదటి భాగము) | | 2-25 |
| వ్యాసరత్నావళి | . | 2-00 |
| నెహ్రూచరిత్ర | .... | 2-50 |
| హిందీప్రచారోద్యమము - దాని స్వరూపము | | 0-75 |

★

*ఇవిగాక దక్షిణభారత హిందీప్రచార సభ పరీక్షలకు కావలసిన పుస్తకములు, లైబ్రరీలకు పనికివచ్చు హిందీ సాహిత్యమునకు సంబంధించిన వివిధ పుస్తకములున్నూ మావద్ద లభించును.*



ది 16-8-59 న హైదరాబాదులోని రాష్ట్రపతి నిలయంలో రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్రప్రసాద్‌గారి అధ్యక్షతన దక్షిణభారత హిందీ ప్రచారసభ - మద్రాసు కార్యవర్గ సమావేశము జరిగినప్పుడు తీయబడిన మరొకచిత్రము

Edited, Printed and Published by V. Anjaneya Sharma, 959 Khairatabad, Hyderabad-4 & Printed at Ajanta Printers, Mahakali St., Secunderabad.